# జమీన్ రైతు

Regd. No. H. NL. 18
సంపుటి 58 సంచిక 40
స్థాపితం: 1930
2-10-1987
శుక్రవారం
10 పేజీలు రూపాయి

స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు

మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి


# పదవి వదలక తప్పనిస్థితి కల్పిస్తారా?

ముఖ్యమంత్రి, రెవిన్యూ మంత్రి మధ్య ఏర్పడుతున్న మనస్పర్థలు బాహాటంగా పత్రికలకెక్కడంతో హఠాత్తుగా రాజధాని రాజకీయ వాతావరణం వేడెక్కింది. బుధవారం ఉదయం ఆంధ్రజ్యోతి దిన పత్రికలో విస్తృతంగా వచ్చిన వార్తా

మా ప్రత్యేక విలేఖరి

కథనంపై తెలుగుదేశం వర్గాలు తీవ్రంగా చర్చించుకుంటున్నాయి.

ముఖ్యమంత్రి ఎన్టీరామారావు తిరుపతి విమానాశ్రయంలో ఈ వార్త చూశారు. అయితే ఆయన అప్పటి కప్పుడు దీనిపై ఏ వ్యాఖ్య చేయలేదు. కనీసం ప్రతిస్పందనకూడా ప్రదర్శించలేదు. చంద్రశేఖరరెడ్డి, గంగాధరంల బహిష్కరణలనాటినుంచే శ్రీనివాసులురెడ్డి అసంతృప్తితో, ..తో, ఆవేదనతో ఉడికిపోతున్నారు. తదనంతరం అత్యంత శీఘ్రగతిన జరిగిన పలు సంఘటనలు ఆయనకు మరీ మనస్తాపం కల్గించాయి.

అయితే తెలుగుదేశం ఆవిర్భావం నుంచి శ్రీనివాసులురెడ్డి తన వ్యక్తిత్వాన్ని చంపుకునే వ్యవహరిస్తున్నారని చెప్పాలి! రాజకీయంగా తన సమ భవం స్థాయిలను కించపరచే సంఘటనలు జరిగినా, తన వ్యక్తిత్వానికి అవమానకరమైన పరిణామాలు సంభవించినా సహించి మంత్రిపదవి కాపాడుకుంటూ వచ్చారు ఎవరేమన్నా. తన అనుచరులను ఎవరెంత అవమానించినా, నమ్మినవారు కళ్ళెదుటే నష్టపోయి మునిగిపోతున్నా తన పదవి తనకు మిగిలితేచాలు అన్న ధోరణితో వ్యవహరించేవారు.

ఈమధ్య ఆయనలో ఆ సహనపు హద్దులు తొలగి, అహంభావం, ఆశ పెరిగిపోయాయి. ప్రజలలో తన ప్రత్యేకతను రుజువు చేసుకోవాలన్న తహతహ, స్వాభిమానం పెచ్చరిల్లుతున్నాయి. ఆయన మాటిమాటికి రాష్ట్రంలో తను నంబర్ టు వని చెప్పుకోవడం ఎన్టీఆర్‌కు నాదెండ్ల నాటి రోజులు గుర్తుకు తెచ్చింది. ఆనాటినుంచి ఆయన శ్రీనివాసులురెడ్డి పట్ల విముఖత పెంచుకుంటూ వస్తున్నారు. రెవిన్యూ మంత్రి ప్రజా విజ్ఞప్తుల దినం పేరుతో రాష్ట్ర పర్యటనలు తలపెట్టడం ఈ అనుమానాలను పెను భూతంగా మార్చివేసింది.

శ్రీనివాసులురెడ్డిని వెల్లకొట్టడానికి గల ఏ అవకాశాన్నీ ఎన్టీఆర్ వదలి పెట్టడంలేదు. ఎన్‌సి బహిష్కరణాదులను ప్రక్కనబెట్టినా; నెల్లూరుజిల్లా పర్యటన, నారాయణమ్మపై చర్య, విజిలెన్స్ దర్యాప్తువంటివి రెవిన్యూమంత్రి ప్రతిష్టను కించపరిచేవే! శ్రీనివాసులు రెడ్డికికూడా పరోక్షంగా తనను అణచివేసే ప్రయత్నాలు ప్రారంభమైనాయన్న శంక పూర్తిగా బలపడింది-తాను ఎంత సర్దుకుపోవాలనిచూసినా, ఎన్ని అవమానాలను దిగమ్రింగినా, ముఖ్యమంత్రి తనను మానసికంగా హింసిస్తున్నారని ఆయన వాపోతున్నారు. "నేను ఎన్టీఆర్ కోసం చేయవలసిందంతాచేశాను. ఈ పయనంలో నాకెంతో ప్రియమైన త్రాగుడు అలవాటు వదలుకొన్నాను; సిగరెట్లు మానివేశాను; ఎన్టీఆర్‌ను ఎవరేమి అన్నా వారిపై విరుచుకపడ్డాను. అందరికీ విరోధులుగా చేసుకున్నాను. ఇంతచేస్తే నాకు దక్కిన ఫలం ఇదీ" అని వాపోతున్నారు శ్రీనివాసులురెడ్డి.

కాంగ్రెస్‌కు అనుకూలురైన ఇద్దరు విలేఖరులు నెల్లూరులో ఏదోచెప్తే అది నమ్మి, తనను అనుమానించే స్థితికి ఎన్టీఆర్ దిగజారడంకూడా ఆయన ఆవేదనగా చెప్తున్నారు.

శ్రీనివాసులురెడ్డి ఎంత ఆవేదన చెందినా చివరకు ఎన్టీఆర్ ధోరణిమాత్రం మారడంలేదు. వ్యక్తిగత బలము పెంచుకోవడానికిప్రయత్నిస్తున్న వ్యక్తిని ఎదగనిస్తే తనకు ఎప్పటికైనా ప్రమాదమేనని ఆయన భయం. శ్రీనివాసులు రెడ్డిని బర్తరఫ్ చేయడం, శాఖల తగ్గింపు వంటి లోక కల్పింపుగా చేయడంవల్ల ప్రజలలో ఆయనకు సానుభూతి పెరిగే ప్రమాదముంది కాబట్టి, ఆయనే తనంతట తాను రాజీనామా చేసే పరిస్థితి కల్పించాలని ఎన్టీఆర్ తలపెడుతున్నట్టు జరుగుతున్న సంఘటనలు

—కొరవ 8వ పేజీలో

## రెవిన్యూమంత్రిపై ముఖ్యమంత్రికి మోజు తగ్గిందా?
## అన్నను ధిక్కరించే ధైర్యం మంత్రిలో కలిగిందా?

# బ్రహ్మ చెముడునూ బాగుచేసే పద్ధతి కనిపెట్టారు విదేశీయులు!

పంచేంద్రియాణాం నయనం ప్రధానం అని పెద్దలు అంటూ ఉన్నారు కాని, చెవి కూడా తక్కువ ప్రాధాన్యం కలిగిందేమీ కాదు. శ్రవణశక్తి లోపించినవారు సామాజిక జీవనంలో ఎదుర్కొనే ఇబ్బందులు అన్నీ ఇన్నీ కావు. చెవుడు అనేది అత్యంత బాధాకరమైన అంగవైకల్యం. చూపు అన్నీ స్పష్టంగా వున్నట్టు కన్పిస్తాయి; కానీ చెవుడున్న వ్యక్తి అందరితో కలిసి మెలిసి సాధారణంగా తిరగలేడు. పదిమందిలో ప్రత్యేక వ్యక్తిగా, ఒంటరితనం భావించవలసి వస్తుంది. ఈ చిన్నపాటి ఆత్మహత్యలవంటి దురాగతాలకు దిగే నిర్భాగ్యులు కూడా లేకపోలేదు.

శ్రవణశక్తి మనిషికి సాంఘికంగానే కాదు, శారీరకంగా కూడా పలు అవరోధాలు కల్పిస్తోంది. తల్లి గర్భంనుంచి బైటికి వచ్చిన తర్వాత శిశువుకు వినికిడి శక్తి ఉంటేనే ధారణశక్తి వస్తుంది. పుట్టు చెవుడు సంక్రమిస్తే మాటకూడా పడిపోయి మూగగా మిగిలిపోవాల్సిందే!

మానవశరీర మనుగడకు ఇంత అవశ్యకమైన ఈ చెవి ప్రధానంగా రెండు భాగాలుగా చీలుతుంది. ఒకటి బయటకు కన్పించేచెవి లేదా కండక్టివ్ అప్పారటస్. ఇందులో కర్ణభేరి (గూబ) మూడు చిన్న ఎముకలు వుంటాయి. రెండవది పర్సీవింగ్ అప్పారటస్. ఇందులో శబ్దాలను గ్రహించే ఆర్గాన్ ఆఫ్ కోర్టి (corti) కోక్లియా (Cochlea) శబ్దాన్ని మెదడుకు చేరవేసే ఆడిటరీ నర్వ్ వుంటాయి.

బయటకు కన్పించే చెవి (ఆరికల్) బయటనుంచి శబ్ద తరంగాలను స్వీకరించి, కర్ణభేరి(టింపానిక్ మెంబ్రేన్స్)కు చేరవేస్తే ఆ తక్షణికంగా ఉత్పత్తి అయ్యే ప్రకంపనాలు చెవిలోని ఎముకలను (Ossicles) కదలించి, తద్వారా ఆర్గాన్ ఆఫ్ కోర్టికి చేస్తాయి. ఇక్కడనుంచి శబ్దతరంగాలను ఆడిటరీ నర్వ్ మెదడుకు చేరుస్తుంది. అప్పటికి వినికిడి శక్తి ప్రక్రియ పూర్తి అవుతుంది.

**డా॥ వై. ఎస్. రెడ్డి**
ఎం. బి. బి. ఎస్; డి. ఎల్. ఓ;
ఎఫ్. ఐ. ఎం.- ఇ. ఎన్. టి.
(వియన్నా)

అందువల్ల మనిషికి శబ్దగ్రహణశక్తి వుండాలంటే ఈ చెవిభాగాలన్నీ సక్రమంగా పనిచేయాలి. ఏ కారణంవల్ల వీటిలో స్వల్పలోపం ఏర్పడినా, ఎంత కొద్ది పరిమాణంలోనైనా అవి స్పందించక పోయినా వినికిడి శక్తితగ్గి చెవుడు వస్తుంది.

చెముడులోకూడా పలురకాలున్నాయి. కోక్లియర్ దశవరకు ఈ సమస్య తలెత్తినా, ఆ లోపం సరిదిద్ది వినికిడిని పెంచేందుకు వైద్యవిధానాలు అందుబాటులోవున్నాయి. కర్ణభేరిలో రంధ్రం ఏర్పడినా ప్లాస్టిక్‌సర్జరీద్వారా మూసివేయవచ్చు. చెవిలోపల్నే ఇబ్బందులవల్ల లోపమున్న ఎముకలు అస్తవ్యస్తమైనా, ఒకదానికొకటి సంబంధంలేకుండా విడిపోయినా, ఇబ్బు నయంచేసిన తర్వాత ప్లాస్టిక్ రికన్‌స్ట్రక్టివ్ సర్జరీద్వారా సరిదిద్దవచ్చు. ఆపరేటింగ్ మైక్రోస్కోప్ ద్వారా లోపలి అవయవాలను గమనిస్తూ చేసే ఈ ఆపరేషన్ ఇప్పుడు నెల్లూరులో కూడా చేసుకోవచ్చు.

అయితే వినికిడిశక్తి తగ్గిపోవడానికి కోక్లియా తర్వాత భాగాలలో లోపం కారణమైతేమాత్రం సరిదిద్దడానికి ఇప్పటివరకు వైద్యవిధానాలే ఏర్పడలేదు. అటువంటి వారికి చెవుడు మెషీన్ పెట్టినా వినపడదు. ఇక జీవితంలో ఆ అదృష్టానికి నోచుకోలేని నిర్భాగ్యులుగా పరిగణింపబడుతూ వచ్చారు. అటువంటి వారికి మందూలేదు, ప్లాస్టిక్ సర్జరీలూ ఫలితాలు ఇవ్వలేదు. ఈ సమస్య నెదుర్కొనే పిల్లలకోసమే చెవుడు మూగ స్కూళ్ళు ఏర్పడ్డాయి. పాపం ఈ పిల్లలు బ్రతికినంతకాలం బధిర ప్రపంచంలో మ్రగ్గిపోవలసి వస్తున్నది.

అయితే ఇటీవల కాలంలో కొన్ని అగ్రరాజ్యాలు ఈ సమస్యను కూడా అధిగమించగల్గే అపురూప వైద్య ప్రక్రియలను కనిపెట్టాయి. దీన్ని కోక్లియర్ ఇంప్లాంటేషన్ ఆపరేషన్ అని పిలుస్తున్నారు! అదృష్టవశాత్తు వియన్నాలోని యూనివర్శిటీ ఇ. ఎన్. టి. ఆస్పత్రిలో

—కొరవ 9వ పేజీలో

### డెంటల్ అసోసియేషన్ సదస్సు

వైద్యరంగ చరిత్రలో విశేషమైన సదస్సు ఒకటి నెల్లూరులో త్వరలో జరగబోతోంది. ఇండియన్ డెంటల్ అసోసియేషన్ రాష్ట్ర శాఖ తొమ్మిదవ వార్షిక సదస్సు నవంబర్ 13 14 తేదీలలో నెల్లూరులో జరుపుతున్నారు. ఈ సదస్సు నిర్వాహక కమిటీకి అధ్యక్షుడు టౌనులో ప్రసిద్ధి చెందిన దంత వైద్యుడు డాక్టర్ జి కొండారెడ్డి, కార్యదర్శి డాక్టర్ జి వి రఘునాథరెడ్డి, కోశాధికారి డాక్టర్ ఎస్. రామమోహనరావు దంతవైద్యంలో ఇప్పుడొస్తున్న ఆధునాతన పద్ధతులను గురించి సదస్సులో చర్చిస్తారట. ఈ సందర్భంగా ఉచిత దంత చికిత్సా శిబిరాన్ని కూడా నిర్వహించనున్నట్లు డాక్టర్ కొండారెడ్డి తెలియజేస్తున్నారు.

### శ్రీరామ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఖాతాదార్ల సమావేశం

శ్రీరామ్ ఇన్వెస్ట్‌మెంట్స్ డిపాజిట్ల సేకరణ సందర్భంగా ఖాతాదార్ల సమావేశం ఈ నెల 26 తేది జరిగింది. సంస్థ అసిస్టెంట్ బ్రాంచి మేనేజరు శ్రీ పి రామమూర్తి ముఖ్య అతిధి; అడ్వొకేట్లు శ్రీ ఎం. సుందరరామిరెడ్డి, శ్రీ ఎస్ మల్లికార్జునశర్మ, శ్రీ టి వి. చెట్టి ప్రసంగించారు. సంస్థ డెవలప్‌మెంట్ మేనేజర్ కుమారి ఎస్. జానకి సంస్థ అభివృద్ధి కార్యక్రమాలను వివరించారు. బ్రాంచి మేనేజరు శ్రీ గోవిందరాజులు వందనాలు చెప్పారు.

### వికలాంగుల సమితి కొత్త కార్యవర్గం

జిల్లా వికలాంగుల సంక్షేమ సమితి కొత్తకార్యవర్గం అధ్యక్షులుగా శ్రీ సిహెచ్. వి. మల్పరాజు, ఉపాధ్యక్షులుగా శ్రీ సి. హెచ్. సుబ్బరాయుడు, కార్యదర్శిగా శ్రీ సి హెచ్ శ్రీనివాసులురెడ్డి, సంయుక్త కార్యదర్శిగా శ్రీ కె ప్రకాష్, సహాయ కార్యదర్శిగా శ్రీ ఎస్ కె. రియాజుద్దీన్, కోశాధికారిగా శ్రీ ఎ. వెంకటేశ్వర్లు ఎన్నికైనారు.

## నెల్లూరు సంగతులు

### చాతుర్మాస్య వ్రతం

చాతుర్మాస్య మహావ్రతం సందర్భంగా నవలాకులతోటలో అక్టోబర్ 3వతేది నుండి, నవంబర్ ఒకటోతేది వరకు శ్రీ రామకృష్ణాశ్రమ పూర్ణానంద స్వామిజీ ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహిస్తారని శ్రీ దివ్యయోగ ఆశ్రమం అధ్యక్షుడు శ్రీ బాలయోగస్వామి తెలియజేస్తున్నారు.

### కళామందిర్ సాంస్కృతిక పోటీలు

కళామందిర్ సాంస్కృతిక సంస్థవారు వచ్చే ఏడాది జనవరి 3 తేది నుండి 9 తేది వరకు రాష్ట్రస్థాయి సాంస్కృతిక పోటీలు నిర్వహిస్తారట. పౌరాణిక నాటకాలు, రంగస్థల పద్యాలు, శాస్త్రీయ, లలిత సంగీతాలు, నృత్యాలు, ఏకపాత్రాభినయాలు, విద్యార్థులకు వ్యాసరచన, ఫ్యాన్సీడ్రెస్ పోటీలు వుంటాయట. వివరాలు టి. దాశరధి, కళామందిర్, పొట్టి శ్రీరాములు బొమ్మదగ్గర, మూలాపేట, నెల్లూరు చిరునామా నుండి తెలుసుకోవచ్చు ★

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press, Nellore-524001